# కథ చెప్పడంలో నైపుణ్యం

## ప్రో. కృష్ణ కుమార్

అనువాదం: రోహిణి చింతా

పిల్లలకు కథలు చెప్పడం నిజంగానే ఒక నైపుణ్యం. కథ చెప్పడంలో సూక్ష్మములు ఏమిటో మనం చూద్దాం.

మన స్కూళ్లలో మొదటి రెండు తరగతులకూ కథలు చెప్పడానికి విడిగా కేటాయించిన సమయం లేకపోవడం ఎంతో విచారకరం. అటువంటి విధానం గనక ఉండి ఉంటే, పిల్లలను బడిలో ఉంచే సమస్య కొంతైనా తీరి ఉండేది. ఎంతో మంది నేను సమస్యను తక్కువ అంచనా వేస్తున్నానని అంటారు. నా ఈ సలహా విని ఎంతోమంది ఉన్నతాధికారులు దిక్కారంగా నవ్వే అవకాశం చాలా ఉంది. కథలు చెప్పడం పిల్లలపై ఒక మాయాజాలంలా పనిచేస్తుందన్న వారి అవగాహనను, ఏదైతే ఒకానొక సమయంలో వారికి తెలిసి ఉండవచ్చని నేను భావిస్తున్నానో, వారి అపార అనుభవం మరియు పరిపాలనా జ్ఞానం వారి మెదడులో నుంచి, తరిమివేసి ఉంటుంది.

ఇంకా ఎంతో విచారకరమైన విషయం ఏమిటంటే, మన ఉపాధ్యాయ శిక్షణ కేంద్రాలలో, వారి పాఠ్య ప్రణాళికలో ఉన్నా సరే, కథలు చెప్పడం అనే విషయాన్ని శ్రద్ధగా తీసుకోరు.

చిన్న పిల్లలకు పాఠాలు చెప్పే ప్రతి ఒక్క టీచర్ కి కనీసం ముప్పై సంప్రదాయకరమైన కథలుపై పట్టు ఉండి ఉండాలని మనం ఆశించగలిగే రోజు వస్తుందని నేను ఊహిస్తున్నాను. పట్టు అనగా, నేను సూచించేది, వారికి ఆ కథలు ఎంత బాగా జ్ఞాపకం ఉండాలంటే, వారు వాటిని అవలీలగా, ఎంతో విశ్వాసంతో చెప్పగలగాలి. కొన్ని వేల కథల వారసత్వం ఉన్న మన సమాజానికి ఇది ఏమంత పెద్ద విషయం కాదు. అటువంటి ముప్పై కథలు, టీచర్ తన స్వేచ్చానుసారం చెప్పగలిగేవి, ప్రాధమిక పాఠశాలలోని మొదటి రెండు తరగతుల వాతావరణాన్నే మార్చేస్తుంది. కానీ ఒక షరతు ఏమిటంటే, కథలుచెప్పడానికి, రోజువారీ పాఠ్య ప్రణాళికలో, కథలుచెప్పడం దానికదే ముఖ్యమైనదన్న నమ్మకంతో, ఒక గౌరవనీయమైన స్థాన్నాన్ని కల్పిచడం మాత్రమే.

కథలు ఎక్కడనుంచి సంపాదించాలి?

ముందుకు కొనసాగే ముందు, ఇందాకటి పారా లో వాడిన ఒక విశేషణం గురించి మీకు ఒక స్పష్టత కలిగించదలిచాను. నేను సంప్రదాయ కథలు చెప్పడం పట్ల నా అనుకూలత వ్యక్తపరిచాను. కథలుచెప్పడంలో యుక్తవయసు టీచర్లకు శిక్షణ ఇవ్వడంలో నా అనుభవం చూపించిన విషయం ఏమిటంటే, వారిని ఏదైనా కథను చెప్పడానికి తీసుకురమ్మని అడిగితే, వారు ఏ పిల్లల మ్యాగజైన్ నుంచో తీసుకువస్తారు. వారిలో కొంతమంది కామిక్స్ నుంచి కథలను తీసుకువస్తే, మరి కొంత మంది పెద్ద జోకులనో, నిజ ఉపాఖ్యానాలనో తీసుకువస్తారు. ఇవి కూడా కథల కిందకే వస్తాయి అన్నది వాస్తవమే కానీ అటువంటి ప్రతీ కథ, ప్రాధమిక పాఠశాలలో చదువుతున్న ఆరు ఏడు ఏళ్ళ వయసు పిల్లలపై అద్భుత ప్రభావం చూపుతుందని ఆశించలేము.

వారసత్వంగా సంక్రమించిన సాంప్రదాయ కథలలో ఉన్న లక్షణాలు, రకరకాల మీడియాలో లభ్యమయ్యే సమకాలీన కథలలో ఉండకపోవచ్చు. ఆ లక్షణాలను ఏమిటో మనం కాసేపట్లో చర్చిద్దాం కానీ మొదట

కొన్ని సాంప్రదాయ కథలను సంపాదించే మూలం చెప్పదలిచాను. మొట్టమొదట: పంచతంత్ర, జాతక, మహాభారత, సహస్ర రజిని చరిత్ర, విక్రమాదిత్యుడి కథలు మరియు వేరు వేరు ప్రదేశాల జానపద కథలు, సరళమైన గొప్ప కథల సమాహారంలో పెట్టవచ్చు. వీటి తరువాత స్థానంలో మనం కథాసరితసాగర, గులిస్తాన్ మరియు బోస్తాన్, ఇంకా ప్రపంచ నలుమూలల నుంచి సేకరించిన జానపద కథలు పెట్టవచ్చు. ఈ సమాహారాలు విరివిగా దొరికేవి కావు. కనుక ఎవరైనా కథలు చెప్పడాన్ని వారి రోజువారీ ప్రణాళికలో ఇమడ్చాలంటే, పైన చెప్పిన మూలాలన్నిటి నుంచి కథలు సేకరించి ఒక సంగ్రహం తయారు చేసుకోవాలి.

చెప్పడానికి అర్హమైన కథ

తరతరాలుగా పిల్లలు ఆసక్తితో ఆనందంతో వినే కథను ఒకదానిని గమనించడం, మంచి కథలోని లక్షణాలు గుర్తించడానికి సులువైన మార్గం. అటువంటి కథలలో, పంచతంత్ర లోని కుందేలు-సింహము కథ ఒక మంచి ఉదాహరణ. కథతో ఉన్న పరిచయం వల్ల మనం ఊహించుకున్నంత సులువైన ఇతివృత్తం కాదు ఈ కథది. మొదట మనం ఈ కథలోని కీలక మలుపులను గుర్తుతెచ్చుకుందాం.

కథలోని ముసలి సింహాన్ని కుందేలు కలవాల్సిన ఒకరోజు వస్తుంది. కుందేలు ఆ సింహం గుహ చేరుకోవడానికి ఎంత ఆలస్యం చేసిందంటే, ఆ పాటికి సింహం ఆకలితో పిచ్చెక్కిపోతోంది. సింహం ఆగ్రహంతో రగిలిపోతున్న ఈ క్లిష్టసమయం, ఏ రకమైన వాదోపవాదాలకు, ఒప్పందాలకు సమయం కానప్పటికీ, కుందేలు సింహాన్ని ఈ ప్రతికూల సమయంలో అంత ఆలస్యం ఎందుకైందో తెలపడానికి అడ్డుకుంది. దారిలో మరొక సింహం ఎదురైందన్న కబురు శుద్ధ అబద్ధం, కానీ అది ఆకలిగా, కోపంగా ఉన్న ఒక సింహం రాజరికపు బుర్రలో నాటుకుపోయింది. ఇప్పుడు అతను ముందు తన ప్రత్యర్థితో వ్యవహరించ తలచి, దానికై ఏ చోట ఐతే ఆ వేరొక సింహం ఉందని అతనికి చెప్పబడిందో, ఆ నూతి వైపు కుందేలుతో నడుస్తాడు. ఈ రెండవ క్లిష్ట ఘడియలో, కుందేలు, తన సొంత పన్నాగాన్ని మరియు తానూ సింహంలో స్వయంగా రేకెత్తించిన వెర్రి పగ ఇంకా ఈర్ష్య మీద ఆధారపడుతూ, ముందుకు సాగుతుంది. తన సొంత ప్రతిబింబాన్ని మరొక సింహంగా పొరపాటుపడుతూ, సింహం తన కోపం కట్టలు తెంచుకుని, తన చావుకి దూకుతుంది.

ఈ తెలిసిన పాత కథని మనం దెగ్గరగా చూద్దాం. మొట్టమొదటగా: ఈ కథా విషయంలో నీతి బోధనలు ఏమాత్రం లేవు. ఇంకా విరుధంగా, కథ, రాక్షస శక్తులు ఎదురైనప్పుడూ లేదా చాలా నిజమైన చావు భయం కలిగినప్పుడు, మనల్ని మనం ఎలా రక్షించుకోవాలి అన్న తీవ్రమైన అంశాలతో సూటిగా వ్యవహరిస్తుంది. సాధారణంగా, మనం పిల్లలతో మాట్లాడేటప్పుడు ఇటువంటి ప్రశ్నలు లేవనెత్తం, కానీ పిల్లలకు అటువంటి ప్రశ్నల పట్ల ఎంతో ఆసక్తి ఉంటుందన్నది స్పష్టమైందే. మనం ఈ ఆసక్తికి ఉన్న కారణం ఏమిటని అడగవచ్చు, కానీ నేను ఈ ప్రశ్నను ఇంకొక క్షణంలో చర్చిస్తాను. ప్రస్తుతానికి, నేను మరొక అంశం పరిగణించ తలచాను. ఈ కథ ఒక పెద్ద శక్తివంతమైన జీవి సృష్టించిన ఇబ్బందితో సతమతం అవుతున్న ఒక చిన్న జీవిది. ఈ ఇబ్బంది నుంచి బయటపడటానికి ఆ చిన్న జీవి, మనం అనైతికం అని అనే ఒక మోసాన్ని ఉపయోగిస్తుంది.

ఈ మోసాన్ని వాడేటప్పుడు, ఆ కుందేలు కొన్ని చక్కటి వ్యక్తిత్వ లక్షణాలను ఉదహరిస్తుంది. ఈ లక్షణాలలో ధైర్యం, అపాయం ఎదురైనప్పుడు ఆత్మవిశ్వాసం, ఒక గమ్మత్తయిన పరిస్థితిలో ఇరుక్కున్నప్పుడు ఆఖరి క్షణం దాకా చెక్కుచెదరకుండా ఉండే నైపుణ్యం, మరియు వయసులోనూ, శక్తిలోను మనకంటే ఎక్కువైన వారి ముందు సరిగా ప్రవర్తించడం అనేవి కొన్ని.

మనం కథ ఎంత త్వరగా ముందుకు సాగుతుందో కూడా గమనించాలి. మొదట్లో, ప్రతీ రోజు ఒక జంతువు తనకు తానుగా ఆ ముసలి రాజుకు ఆహారమవ్వాలన్న ఒక వింత వ్యవస్థ స్థాపించబడింది. త్వరలోనే, ఆ చిన్న కుందేలు వంతు, ఇక కథ యొక్క కేంద్ర కథాంశం వెల్లడి అవుతుంది. ఆ కుందేలు, తనని తాను

రక్షించుకోవడానికి ఒక ప్రమాదకరమైన వ్యూహాన్ని వాడ నిశ్చయించాక, ఇక ఒక క్షణం కూడా వృధా చేయలేకపోవడంతో మిగిలిన అంశాలు చాలా త్వరగా జరుగుతాయి. డైలాగుల ద్వారా, ఒక పరిస్థితి నుంచి మరొకదానికి కథ వినేవారు నెట్టబడతారు. వినేవారికి ఆ పరిస్థితి కుందేలు యొక్క కోణంలో చూడడం తప్ప ఇంకేమి ఎంచుకోవడానికి లేదని స్పష్టంగా తెలుస్తోంది.

ఈ కథ పిల్లల మధ్య అంత విపరీత ఆదరణ పొందడానికి కారణం ఏమిటో గుర్తించడానికి ఈ సంక్షిప్త విశ్లేషణ చాలు. అన్నిటికంటే ముందు, ఈ కథ, పిల్లలకు వారు పూర్తిగా తమను తాము పోల్చుకో కలిగే ఒక హీరో పాత్రను ఇస్తుంది. ఆ పాత్ర కుందేలు. కథలోని అతని పాత్ర, పిల్లలు రోజువారీగా వారి జీవితాల్లో పడే కష్టాలు, ఎదుర్కొనే పరీక్షలు వంటి పోల్చుకో కలిగిన పరిస్థితుల గుండా వెళ్తుంది. అతను చిన్నవాడు, శక్తిహీనుడు. అతను అతనికి చేయడం ఇష్టం లేని పని ఏదో చేయాలి. శక్తి, బాహు బలం కలిగిన ఒక జీవి చేతిలో చచ్చిపోతాడని అతని భయం. తల్లితండ్రుల మరియు టీచర్ల పాత్రలు వేయడంలో బిజీగా ఉండి, అది తరచుగా మనం గమనించపోయినప్పటికీ, కుందేలు పరిస్థితితో పోల్చుకో తగ్గ అంశాలు పిల్లల జీవితంలో కూడా తలెత్తుతుంటాయి. ఉదాహరణకి, ఆకస్మిక మరణ భయం పిల్లలకు అతి పెద్ద ఆందోళన కలిగించే విషయం అని మనలో చాలా తక్కువ మందికి తెలుసు. ఒక పెద్ద, బలమైన జీవితో ముఖా ముఖీ రాగలమనే దిగులు కూడా పోల్చుకోతగ్గ ఆందోళనను కలిగిస్తుంది.

ఈ కథ మొదలవుతూనే పిల్లల దృష్టిని ఆకడుతుంది. ఎందుకంటే పిల్లలు తమను తాము కథలో చూసుకోగలరు. వారి ఆకర్షణను కథలోని అంశాలు మరింత బలపరుస్తాయి. ఆ చిన్న కుందేలు ఒక వ్యూహాన్ని ఎంచుకుంటుంది, ఇంకా ఆ వ్యూహం ఎంతో ప్రభావవంతం అయిందని రుజువవుతుంది. ఆ ఎత్తు తనకు పారడమే కాక, సమస్యను ఒకే సారి అందరికీ అంతం చేస్తుంది. చిన్నపిల్లలకు అటువంటి పరిష్కారం ఇష్టం. కుందేలు యొక్క వ్యూహం పట్ల ఆకర్షణకు ఇంకో కారణం ఏమిటంటే అది పిల్లలలో ఎప్పుడూ కనిపించే ఒక చాలా అమాయకమైన కోరిక మీద ఆధారపడింది - సాకులు చెప్పాలన్న కోరిక. కుందేలు ఆలస్యంగా రావడానికి చెప్పే సాకులో మరొక ఆకర్షణ ఏమిటంటే అతని లక్ష్యం తన ప్రాణాన్ని కాపాడుకోవడమే కాదు, ఆ సింహాన్ని చంపడం కూడా. నిజానికి కుందేలు సందిగ్ధం చాలా కష్టమైనది. ఎందుకంటే ఆ క్రూర సింహాని చంపకుండా తనను తానూ రక్షించుకోలేదు. అలాగే, ఈ కథ వీర విధ్వంసాన్ని వాడి, ఒక అద్భుతమైన ప్రాణరక్షణ నాటకీయతను చూపిస్తుంది. అందులో ఏదైనా నీతి ఉంటే, అది ఆత్మ రక్షణ యొక్క నీతి. మనం ఈ విషయాన్ని పిల్లల కోణం నుంచి చూసినప్పుడే సరిగ్గా చూడగలుగుతాము. మనం ఈ కథను పెద్దల కోణం నుంచి చూడడానికి పట్టుపడితే, మనం ఇది చాలా నీతి లేని కథ అన్న ముగింపుకు వస్తాము - అది నిజం కూడా.

ఏమిటి అవసరం?

పిల్లలు మంచి కథ వినడానికీ, నీతులకీ , నీతి శాస్త్రానికి ఏమి సంబంధం, కనీసం ప్రత్యక్ష సంబంధమైతే లేదని, ఇప్పటికే స్పష్టం అయి ఉంటుంది. లోతుగా చూస్తే, సింహం కుందేలు కథలో ఏదో స్ఫూర్తి కలిగించే విషయం ఉంది. ప్రమాదం ఈ కథ, ప్రమాదం వచ్చినప్పుడు, ప్రశాంతంగా ఉండడం ఎంత లాభదాయకమో చూపుతుంది. ఇంకా ఈ కథ, ఇంగిత జ్ఞానం మరియు ఊహ అనేవి ఎంత ముఖ్యమో చూపుతుంది. కానీ ఈ విషయాలని, సాంప్రదాయిక నైతిక విద్యగా పరిగనించలేము. నిజానికి, గొప్ప సాంప్రదాయ కథలు అరుదుగా నీతులు సాంప్రదాయ పద్దతిలో బోధిస్తాయి. ఇంకా ముఖ్యంగా మనం గమనించాల్సినది ఏమంటే, కథలు చెప్పడం లోని ప్రయోజనం పిల్లల నైతిక అభివృద్ధి కాదు. కథలు చెప్పడం వల్ల ఉపయోగాలు ఎన్నో. అవి ఈ కింది చెప్పబడ్డవి.

కథలు మన వినే సామర్ధ్యాన్ని పెంచుతాయి: ఎవరు మంచి వినేవాడు? ఎవరైతే చివరి దాకా వింటాడో, వాడు. ఇది ఎక్కువ మంది మనుషుల గురించి చెప్పలేము. అధికారిక చర్చలలో కూడా, జనం అంతరాయం కలిగిస్తూనే ఉంటారు. ఇది వాళ్లకు వక్త ఏమి చెప్పబోతున్నారో తెలుసుననే అపోహల వల్ల.

ఇంకొక కారణం వారికి వినే సహనం లేకపోవడం వల్ల. అధునాతన నిర్వహణా మరియు పరిపాలన కోర్సుల ప్రోత్సాహంతో, ఇప్పుడు, వినగలగడం అనేది ఒక నైపుణ్యమే కాదు, ఒక వైఖరిగా పరిగణించబడడం ఏమి ఆశ్చర్యకలిగించదు. కథలుచెప్పడం అనేది మన జీవితంలో, వినే అలవాట్లు మరియు వైఖరులు జీవితకాలం అలవాట్లుగా మారే, అతి ముఖ్య/ క్లిష్ట వయసులో ఓర్పుగా వినగలిగే శక్తిని పెంపొందిస్తుంది.

కాస్త వింతైన విషయం ఏమిటంటే, ఎంతో బలమైన, పురాతన మౌఖిక సాంప్రదాయం ఉన్న మన దేశంలో కూడా, చక్కటి శ్రోతలు చాలా అరుదైపోవడం. నా అంచనా ప్రకారం ఈ పరిస్థితి చిన్నతనంలో కథల పట్ల అశ్రద్ధకి సంబంధించినది. భావిభారతానికి రోజువారీగా పిల్లలకు కథలు చెప్పే సమయం లేనట్టుంది. ఈ లోపం యొక్క పర్యవసానాలు ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

కథలు చెప్పడం అంచనా వేసే సామర్థ్యాన్ని పెంచుతుంది : పిల్లలు వారికి నచ్చిన కథలు పదేపదే విందాం అనుకుంటారు. ఇది ఎందువల్లనంటే, ఒక సారి వారికి ఆ కథ పరిచయం అయ్యాక, వారు వారి వినికిడిని శక్తిని పరీక్షించుకోవడానికి, ఆ పరిచయాన్ని వాడతారు. ఈ పరీక్ష వారికి తెలియకుండానే జరగడం సహజం. కథను రెండోసారో మూడోసారో విన్నప్పుడు, కథలో తరువాత ఏమి జరుగుతుందో విజయవంతంగా ఊహించినప్పుడు, పిల్లలు విపరీతంగా ఆనందపడతారు. వాళ్ళు ఊహించినది సరైనది అని నిరూపించబడడంలో పొందే ఆనందమే అనుభవజ్ఞులైన శ్రోతలు కథ వినడం ద్వారా వచ్చే ప్రతిఫలం, మరియు అది ఉత్త ఆనందం మాత్రమే కాదు. ఇది కథ వినే పిల్లలలో, అంచనా వేసే విశ్వాసాన్ని కూడా పెంచుతుంది. ఈ నమ్మకం పిల్లల పూర్ణాభివృద్ధిలో చాలా లోతైన పాత్ర పోషిస్తుంది - ప్రత్యేకించి చదవగల సామర్థ్యం పెంపొందించడంలో. ఈ సామర్థ్యం పాఠశాలలో మొదటి రెండు తరగతులలో అతి పెద్ద సవాలు. నేను నా పుస్తకం 'ది చైల్డ్'స్ లాంగ్వేజ్ అండ్ ది టీచర్' లో అంచనా వేయగల సామర్థ్యం అక్షరాస్యతకు మరియు నేర్చుకో గల సమర్థతకు ఎలా తోడ్పడగలదో చాలా విపులంగా చర్చించాను.

అంచనా వేయగల సామర్థ్యం ఇతర సబ్జెక్టులు చదవడానికి ముఖ్యంగా సహకరిస్తుంది, ప్రత్యేకించి గణిత శాస్త్రం మరియు సైన్స్ చదవడానికి. రూల్స్ వాడి లేఖలు పరిష్కరించడం అనేది గణిత శాస్త్ర పఠనంలో సిద్ధాంతిక ప్రాముఖ్యత కలిగి ఉంది. కథలలో కూడా రూల్స్ ఉంటాయి. తేడా ఏమిటంటే ఈ రూల్స్ రూపకాలగా ఉంటాయి. ఉదాహరణకి, చాలా కథలు, చిన్న జీవులు పెద్దవాటి మీద విజయం మోసగించడం ద్వారా సాధిస్తాయన్న రూలు పాటిస్తాయి. కుందేలు సింహం కథలో ఇదే జరుగుతుంది. పిల్లలు కథలు వింటూ, వాటిలో అంతర్గతమైన రూల్స్ ని పట్టేస్తారు, ఇక ఈ పట్టు వారి అంచనా వేయగల శక్తిని మెరుగుపరుస్తుంది.

కథలు మన ప్రపంచాన్ని పెద్దది చేస్తాయి: నేను మనం మన బుర్రలో ఇంకా మనసులో మోసే ప్రపంచం గురించి మాట్లాడుతున్నాను. కథలు, ఏ అర్థంలో మన ప్రపంచాన్ని పెద్దది చేస్తాయంటే, మనం ఎన్నడూ ఎదుర్కోని మనుషులను మరియు పరిస్థితులను, వాటి ద్వారా మనం అర్థం చేసుకోగలుగుతాము.

ఇక్కడ ప్రశ్న ఏమిటంటే, మనం అటువంటి మనుషులను, పరిస్థితులను తెలుసుకుని ఏమి ఉపయోగం అని? దాని ప్రయోజనం ఏమిటంటే వారు మన జీవితంలో భాగం. వారు మనకి వ్యక్తిగతంగా తెలియకపోయినా, వారు మనని మానసికంగా కలవరపరుస్తారు, ప్రత్యేకించి బాల్యంలో - కానీ సాధారణంగా ఈ ఇబ్బంది జీవితాంతం ఉంటుంది.

ఉదాహరణకి, చిన్న పిల్లలు, వారి చుట్టూ చెడ్డ మనుషులు లేక పోయినా సరే, చెడ్డవారి గురించి ఆందోళన పడతారు. అలాగే, వారి హృదయపు లోతుల్లో, ఎవరైనా చాలా తెలివైన, అందమైన లేదా మంచి వారిని కలిసే అవకాశం రావాలని, వారు ఆశపడుతుంటారు. ఆదర్శ రూపం యొక్క ఊహ మరియు భయంకరమైన విపత్తు యొక్క భయం, రెండూ పిల్లల మనస్తత్వ శాస్త్రంలో ఉంటాయి. సాంప్రదాయక కథలు ఈ మనస్తత్వాన్ని వెళ్లబుచ్చుతాయి, ఇక అందుకే అవి పిల్లలను సునాయాసంగా ఆకర్షిస్తాయి. అటువంటి

కథలు వినడంవల్ల, ఇంకా అక్ష రజ్ఞానం కూడా లేని ఒక చిన్న పిల్ల/పిల్లవాడు, వాడి నిజ జీవితం కంటే ఎంతో పెద్దదైన ఊహ లోకాన్ని అనుభవించగలుగుతాడు.

కథల నుంచి వచ్చే అనుభవం యాదృచ్ఛికం కాదనేది మరొక విషయం. ఇందుకు విరుధంగా, ఈ అనుభవం మన అస్తవ్యస్త ప్రపంచాన్ని ఒక సంతృప్తి కరమైన క్రమంలోకి మరియు ఆకారం లోకి తెస్తుంది. లోతైన అర్థంలో, సామాన్య అర్థంలో కాదు కానీ,
అది ఒక నైతిక ఆకారం. బలహీనులు గెలుస్తారు, కానీ తరచుగా తప్పుడు పద్ధతులు వాడి. ఒక ఉదాహరణ, కుందేలు ఆకలితో ఉన్న సింహంతో అబధం చెప్పడం.

కథలు వినడం మరియు చదవడం

మొత్తానికి, మనం, పిల్లల భాషా పరిజ్ఞనం పెంచడంలో కథలు చెప్పడం యొక్క ప్రాముఖ్యతను చూశాము. పదాలు చాలా వ్యక్తిగత ఆస్తి. అవి మనకు ప్రపంచంలోని వస్తువులకు చాలా వ్యక్తిగతంగా రకరకాల పేర్లు పెట్టుకునే సమర్ధతను ఇస్తాయి. మరొక పక్క, అవి మన అనుభవాలను ఇతరులతో పంచుకోవడానికి వాడే సామాజిక ఆస్తి కూడా. ఈ ద్విభావ తత్వమే పదాలకు అర్థమిస్తుంది. ఉదాహరణకు, తన సొంత అనుభవంతో ఒక పిల్లవాడికి, ఆకలితో ఉన్న సింహం ఎలాంటి అనుభూతి పొందుతోంది అనేది తెలుసు. కథ, ఆ పిల్లవాడికి, 'ఆకలి' అన్న పదంలో సింహాన్ని కూడా చేర్చేలా దాని అర్థాన్ని పొడిగించే సహాయం చేస్తుంది. పిల్లలు ఎక్కువ కథలు విన్న కొద్దీ, ఎక్కువగా వారి పదజాలంలో ఇతరుల అనుభవాలను వర్ణించే అర్థాలను పొందుపరుస్తారు. ఈ విధంగా చూస్తే, వారు చిన్నపుడు విన్న కథలు వారు పెద్దయ్యాక చదవగలిగే సమర్ధతకు ఆధారం అవుతాయి.
నిజానికి, పైన కథ సందర్భంలో చెప్పిన నాలుగు విషయాలూ చదవడానికి కూడా వర్తిస్తాయి. చదవగల సామర్ధ్యం, పిల్లలకు భాష యొక్క నియమాలు మరియు నిర్మాణం పరిచయం చేస్తాయి. బాగా చదవగల సామర్ధ్యం, తెలివైన అంచనాలు వేయగల అలవాటు పై ఆధారపడి ఉంటుంది. భాష నియమాలు తెలియడంతో పిల్లలు ఒక వాక్యంలో లేదా ఒక ప్రకటనలో తరువాత వచ్చే విషయాన్ని ఊహించగలరు. కథలు చెప్పడం ఈ కోణంనుంచి పిల్లలను అక్షరాస్యులను చేయడానికి ఉపయోగపడుతుంది.

కథలు చెప్పడంలో నైపుణ్యం

కథలుచెప్పడం అనే కళ పై పట్టు సాధించాలనుకునే వ్యక్తి జ్ఞాపకశక్తిని అతి శ్రద్ధగా తీసుకోవాలి. కథకుడు కథను సరిగా గుర్తుంచుకోలేకపోతే, ఎంతో ఉత్తమమైన కథను కూడా నాశనము చేయగలడు. కంఠస్థం, ఆత్మవిశ్వాసం పెంచి, కథకుడను తేలికపడేలా చేస్తుంది. శ్రోతలతో సంబంధాన్ని నిర్మించుకోవడానికి సునాయాసము మరియు ప్రశాంతత ఎంతో ముఖ్యమైనవి. ఇంకా, కథ బాగా గుర్తున్నంత వరకు, కథకుడు దాన్ని ఒక బ్లూ ప్రింట్ గానో లేదా ఖాళి పఠంలానో వాడుకోవచ్చు.

ఈ పఠం కథకుడి వీలు ప్రకారమే, శ్రోతల మానసిక స్థితి ప్రకారమే నింపుకోవచ్చు. కేతు పెద్దగా, లేదా చిన్నగా చేయడం చాలా ముఖ్యం. ఒక్కొక్క రోజు మీరు కుందేలు సింహం ముందు నుంచున్న విషయానికి త్వరగా రాదలచవచ్చు. మరొక రోజు మీరు కథ మొదటి భాగాన్ని వివరంగా, సింహం ఆహారం కోసం వేచి చూస్తున్నప్పుడు దాని మనసులో తిరిగే ఆలోచనలు, ఇంకా సింహం గుహకు వెళ్తుండగా కుందేలు బుర్రలో పుట్టే ఆలోచనలు, దాని ఎత్తులు చర్చిస్తూ కథను బాగా పొడిగించదలచవచ్చు.

కథ గురించి పిల్లలతో సంభాషించడం అనేక రకాలైన ఎంపికలను చేసుకునే వీలు కల్పిస్తాయి. మీకు కావలిస్తే, నాటకీయంగా రెండు రకాలైన గొంతుతో మాట్లాడు, ఇంకా సౌంజ్ఞలు లేదా భంగిమలు వాడు. చిన్న చేతి తోలుబొమ్మలు కూడా వాడి సంభాషణకు ప్రాణంపొయ్యి. గదిలోని ఒక మూల నుంచి మరొకమూలకి నడుస్తూ, నీవే రెండు పాత్రలను పోషించవచ్చు. ఈ అన్ని అవకాశాలు ఆసక్తికరమైనవి. మరియు అవి,

ఏడాది తరువాత ఏడాది, లేదా ఒకే ఎడాదిలో చాలా సార్లు, మనం అదే కథ చెప్పే సామర్థ్యాన్ని పెంపొందించుకునేందుకు సవాల్ చేస్తాయి.

ఒక టీచర్ యొక్క నిత్యజీవితంలో కథలుచెప్పడం చేరిస్తే, ఇక ఎన్నటికీ బోరు కొట్టదు. కానీ కథలు చెప్పడం రోజువారీ ఘటనగా చేయాలంటే, ప్రాధమిక పాఠశాల ప్రణాళిక పట్ల మన దృక్పధాన్ని మార్చుకోవాలి.

కథ: కుందేలు తెలివైనది అని ఎలా పేరు వచ్చింది

చాలా కాలం క్రితం ఒక రోజు, అడవికి రాజైన సింహం ఆహారం కోసం రోజు వేటాడి, వేటాడి  విసిగిపోయింది. అప్పుడు అతను అనుకున్నాడు, అన్ని జంతువులు నిస్సందేహంగా తనని రాజుగా గౌరవిస్తాయి కాబట్టి, వేట వెనకాల పరిగెత్తే బదులు, అతను జంతువులను, రోజుకొకరు చప్పున వచ్చి తన ఆకలి తీర్చి, సంతృప్తి పరచాలని శాసిస్తాడు.

అతను అడవిలోని జంతువులను అతని వద్దకి పిలిచి చెప్పాడు "నా ప్రజలారా, నేను నా ఆహారం కోసం రోజు వేటాడాలి. దానివల్ల మొత్తం అడవి నన్ను చూసి భయపడుతోంది. నేను రోజుకు ఒక జంతువునే చంపి తింటాను, కానీ మీరు భయంగానే ఉండిపోతున్నారు. ఇప్పుడు మనం ఒక తార్కిక ఒప్పందం చేసుకుందాం. ప్రతి ఉదయం ఒక జంతువు తనను తాను, నేను భుజించడానికై నాకు సమర్పించుకుంటుంది.  మీలో మీరు అది ఏ జంతువన్నది నిశ్చయించుకోవచ్చు. ఆ విధంగా నేను వేటాడే ఇబ్బంది నుండి రక్షింపబడతాను. మీరందరు అడవిలో భయంలేకుండా సంచరించవచ్చు అని కూడా దీని అర్థం. జంతువులు వాటిలో అవి చర్చించుకుని, ఈ పద్ధతి అందరికి ప్రయోజనకరంగా ఉందని ఒప్పుకున్నాయి. ప్రతి సాయంత్రం ఒక డ్రా తీయబడుతుందని నిశ్చయించుకున్నాను. ఎవరి పేరైతే చీటీ మీద ఉంటుందో, వారు మరుసటి రోజు సింహానికి ఆహారం అవుతారు. ఈ కొత్త పథకం వెంటనే అమలుపరిచారు: సాయంత్రం ఒక చీటీ తీయబడుతుంది, ఇక మర్నాడు ఉదయం ఒక నిస్సహాయ జంతువూ సింహం ఫలహారం కోసం తనను తానూ సమర్పించుకోవాలి. ఇది నిస్సందేహంగా ఆ ఎంచ బడ్డ జంతువుకు చాలా చెడ్డ విషయం, కానీ దీని వల్ల, కనీసం మిగిలిన జంతువులు, తిరిగే సింహం ఆకస్మిక దాడి చేస్తుందనే భయం లేకుండా, స్వేచ్ఛగా అడవిలో తిరగగలిగాయి.  ఈ ఉపాయం బాగానే పనిచేస్తున్నట్లు అనిపించింది.

ఎప్పుడైతే ఒక సాయంత్రం కుందేలు పేరు ఉన్న చీటీ బయటకు వచ్చిందో, అతను తనకు సింహానికి ఆహారం అయ్యే ఉద్దేశమే లేదని ప్రకటించాడు.

దానికి నక్క అంది "సింహం తన మాటను నిలబెట్టుకుంటోంది మరియు మనం భయం లేకుండా బయట తిరగగలుగుతున్నాము".

కోతి అంది "కుందేలు, నువ్వు వెళ్ళాక పోతే, నువ్వు మమ్మల్నందరిని ప్రమాదంలో పెట్టిన వాడవు అవుతావు".

"శాశ్వతంగా ఆ దుర్మార్గుడని అంతం చేస్తాను" అంది కుందేలు తనకు లేని ఆత్మవిశ్వాసంతో "చూడండి, మీరంతా ఒక రోజు నాకు కృతజ్ఞతలు చెప్పుకుంటారు".

"సింహం మళ్లి వేటాడడం మొదలు పెట్టిందని మాకు గాని తెలిస్తే, మేము నీకు కృతజ్ఞతలు చెప్పం" అంది అడవి పుంజు.

“అదంతా నాకు వదిలెయ్యండి” అని కుందేలు హాయిగా పడుక్కున్నాడు. కానీ కుందేలు నిద్రపోలేదు. అలా గంటలు గంటలు పడుకుని, ఆ దుష్ట సింహం నుంచి అడవికి విమోచనం ఎలకల్పించాలా అని, తనకూ, తన తోటి వారికి, ఏమి చెయ్య వచ్చా అని ఆలోచిస్తూ ఉన్నాడు.

పొద్దున్నకల్లా ఒక పరిష్కారం ఆలోచించాడు. ఒక సారి ప్రతీది బాగా ఆలోచించి, తన ఆలోచన పనిచేస్తుందని సంతృప్తి చెందాక, తనను తాను రిఫ్రెష్ చేసుకోవడానికి ఒక కునుకు తీశాడు. అతను సింహం గుహకు సూర్యుడు పూర్తిగా ఉదయించాక చేరాడు. సింహం అతని కోసం అసహనంగా ఎదురుచూస్తూ, గర్జిస్తూ ఉంది. సింహం కోపంగా ఉన్నాడు, ఒకటి, కుందేలు ఆలస్యంగా రావడం అమర్యాద సూచిస్తుంది, ఇక రెండు, అతను ఆకలిగా కూడా ఉన్నాడు. కుందేలు ముందుకు అడుగు వేసే సరికి, సింహం గర్జించింది “నువ్వా నా ఫలహారం?”

“అవును, ప్రభు” సమాధానం చెప్పింది కుందేలు గౌరవంగా.
“అయితే ఆలస్యంగా ఎందుకువచ్చావు?” విచారించింది సింహం కోపంగా.

“నేను మీకు చెప్తాను, ప్రభూ “, అంది కుందేలు. “నేను ఇక్కడకు ఉదయాన్నే వస్తుండగా, నేను ఇంకొక సింహం చేత అడ్డగింపబడ్డాను. అతను నన్ను ఫలహారంగా తినదలచి నేను ఇక ఏమాత్రం ముందుకు పోకూడదని అన్నాడు. నేను అడవికి రాజైన వారి దగ్గరికి వారి ఆజ్ఞ ప్రకారం చేరుకోవాలని, ఆగలేనని అతన్ని వేడుకున్నాను. ధ్దనితో అతను కోపోద్రిక్తుడై, అతనే అడవికి రాజాని చెప్పడం మొదలు పెట్టాడు. మరియు గర్జించాడు, “వెళ్లి నా అధికారాన్ని అతిక్రమించిన సింహంతో చెప్పు నేను వచ్చానని, ఇక నేను వచ్చి దాన్ని చంపుతానని”. మిగిలిన జంతువులకు కూడా చెప్పు, ఈ అడవికి నిజమైన రాజు వచ్చాడని మరియు ఆ కపట సింహాన్ని తరిమేస్తానని”. “అంచేతే, ప్రభు”, అంది కుందేలు “మీరు నన్ను మీ పలహారాన్ని చేసుకునే ముందు, మీ జీవితం పెద్ద ప్రమాదంలో ఉందని మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను “

ఆకలితో, ఈ అమర్యాదతో కోపావేశుడై, సింహం గర్జించాడు “కపటినా!” అతడే కపటి!. నన్ను అతని వద్దకు ఇప్పుడే తీసుకువెళ్లు, అడవికి అసలైన రాజెవరో నేను అతనికి చుపిస్తాను”.

కుందేలు బయల్దేరింది, సింహం వెనక అనుసరించింది. “ఇప్పుడు జాగ్రత్తగా నాడు, మనం ఆ తిరుగుబాటు దొంగ గుహ చేరుకుంటున్నాము” గుసగుసలాడింది కుందేలు.

నిజానికి, కుందేలు సింహాన్ని ఒక లోతైన నుయ్య వద్దకు తీసుకువెళ్తోంది. అక్కడికి చేరుకున్నాక, సింహాన్ని కాసేపు ఆగమని, కుందేలు మెల్లగా నూతి దగ్గరకు వచ్చింది. అప్పుడు జాగ్రత్తగా గట్టుపై నుంచి కింద ఉన్న నీటిలోకి చూడడం ప్రారంభించింది. అతని చిన్న ముఖం యొక్క ప్రతిబింబం స్పష్టంగా చూసాడు. అప్పుడు సింహాన్ని పిలిచి చెప్పాడు “అదిగో కింద చూడు, ఇదే నీ పాలనని లాక్కుందాం అనుకుంటోంది”.

సింహం ఆ నూతి గోడ అంచు చేరింది, గొణుక్కుంటూ, కోపంలో అరుచుకుంటూ. కిందకి చూస్తే, ముఖం చిట్లించి, గాండ్రిస్తూ, కోపంతో ఉన్న సింహం మూతి కనిపించింది. అతను శత్రువు మీదకు ఉరికాడు, కాసేపు తడబడ్డాడు, తరువాత మునిగిపోయాడు.

కుందేలు గబగబా ఇతర జంతువుల వద్దకు తిరిగివెళ్ళి, సింహాన్ని చంపేశానాని, ఇక వారి భయకంపితమైన రోజులు పోయాయని ప్రకటించాడు. అప్పుడు అతడు అందరికి తన సాహసం , తాను అది అంతా ఎలా సాధించాడన్న కథ చెప్పాడు. అన్ని జంతువులు అతని తెలివితేటల్ని పొగిడాయి.

ఆ రోజు నుంచి, జంతువులు కుందేలువద్దకు తమకు సలహాలు ఇచ్చి తమ సమస్యలు తీర్చమని, ఇంకా వివాదాలు పరిష్కరించమని వెల్తూ ఉండేవి. ఇలా ఆ కుందేలు ‘తెలివైన కుందేలు’ గా పిలువబడింది.

****************************************************************************

ప్రో. కృష్ణ కుమార్ ఒక ప్రఖ్యాత విద్యావేత్త మరియు విద్య యొక్క సమస్యల గురించి ఆలోచించడానికి, వ్రాయడానికి అంకితమైన రచయిత. రాజ్ సమాజ్ ఔర్ శిక్ష మరియు బచ్చే కి భాష ఔర్ అధ్యాపక్ అనేవి ఆయన ప్రసిద్ధమైన రచనలు.

ఈ-పుస్తకం: డా: డి .డి. పంత్ మెమోరియల్ చిల్డ్రన్'స్ సైన్స్ రీసెర్చ్ సెంటర్, బెటినాగ్ రీడ్, టీచ్ అండ్ ప్రమోట్ ది కల్చర్ అఫ్ రీడింగ్ అండ్ రైటింగ్.